# చెంచు నాటకము

## యక్షగానము

### విషయ సూచిక

# చెంచు నాటకము

## యక్షగానము

క. వరతరిగొండ నృసింహుల
వరమున, గురుండైన శ్రీనివాసుల కరుణన్
నరులెన్నం జెంచుచెలి కథ
నరుదుగ నింజేటి వెంగమాంబ రచించెన్.

### ✳ కథా క్రమము ✳

ద్విపద. ఘనమైన తత్కథా - క్రమమెట్టు లనిన:
జనులెల్ల వినుం డిది - సాంగంబుగాను
శివకరంబగుచున్న - శేషాద్రియందుం
బ్రవిమల ఫలపుష్ప-భరిత భూజములు,
జాతివైరంబు లెం - చక గుమి గూడి
ఖ్యాతి కెక్కిన దివ్య - ఖగమృగాదులును,
స్ఫుట తపోధనులు, తుం - బురు, నారదాది
పటు జటాధారులు, - బహు సిద్ధనరులు,
నరుల పాపచయంబు - నశియింపం జేయు
పరమ పావన తీర్థ - పటలంబుం గలిగి
పొలుపొందుచుండు తుం - బురు కోననుండి
మొలక నవ్వుల చెంచు - ముద్దుల గుమ్మ

వలనొప్ప శృంగార - వతి యొక్క నాఁడు
కులుకుగాఁ బాఱుటా - కుల చీరఁ గట్టి

సొగసుగాఁ దమజాతి - సొమ్ములు పెట్టి
* మొగమునఁ దిలకంబు - మెచ్చుగా దిద్ది

కనుల నందంబుగాఁ - గాటుక దీర్చి
పునుఁగు, జవ్వాది సొం - పుగ మేనఁ బూసి

ఎడమ కొ ప్పొనరించి - యింపైన మంచి
యడవి మల్లె సరంబు - లా చుట్టుఁ జుట్టి

కొడుకును పైఁటలోఁ - గుదురుగాఁ గట్టి
యడదార మేటి వి - ల్లమ్ములు పట్టి

ఆడాడఁ జెంచునా - యనితోడ వేఁట
లాడుచు వచ్చి, తా - నంతలో నతని

పొడగాన 'కెక్కడఁ - బోయెనో'! యనుచు
విడిబడి యందందు - వెదకుచుఁ దిరిగి

తరిగొండ హరి శేష - ధరణీధరేంద్రుఁ
డిరవొందు పురమున - కింపొంద వచ్చి

*భయభక్తులను తన - ప్రాణ నాయకుని
ప్రేమతో నందుండి - పిలిచె నిట్లనుచు:

* 'మొగమునఁ దిలకంబు - ముద్దుగా దిద్ది'- అని యుండవచ్చు. అట్లైన యతిమైత్రి సరిపోవును.

* 'ఈ చివరి ద్విపద ప్రాసమైత్రి రహితంగా సాగింది. మధుర కవితలలో ఇలాంటి ధోరణులు సహజమే.

## ✳ చెంచెత తన నాథుని పిలుచుట ✳

### దరువు - ఆది తాళం

నా నాథ! నాథా! - నా నాథ! నాథా!
ఓ నాథ! నాథా! - ఓ నాథ! నాథా! ॥పల్లవి॥
ఎంత దవ్వరిగితి వి - దేరా? నాథా! 1
దూరాటవులాకుఁ - బోకు రారా! నాథా! 2
మెకము లిందుండావి - మెండూగ నాథా! 3
పొంచీ వేతాము రారా! - చెంచూల నాథా! 4
నినుఁ బాసి తాళఁజాల - నే నాత్మనాథా! 5
మ్రొక్కేను రావోయి! - చక్కాని నాథా! 6
గూడెముఁ జేరుదాము - గొబ్బున నాథా! 7
వేంకటేశ్వరునిఁ గొలిచే - వేళాయె నాథా! 8
తరిగొండ హరినిఁ బొగడే - తఱి వచ్చె నాథా! 9

తే.గీ. అనుచుఁ జెంచిత చెంచునాయని వెదకఁగఁ
జూచి, హరిద్వారపాలకుల్ చోద్యముగను
దాని రప్పించి 'యెవ్వరిదాన?' వనుచు
నడుగ, నచ్చెలి వారి కిట్లనియె నపుడు: ౨

## ✻ చెంచెత వేంకటేశ్వరుని ద్వారపాలకులతో సంభాషించుట ✻

### చెంచెత పూర్వ వృత్తాంతము

ద్విపద. వినరన్న! నాపూర్వ - వృత్తాంతమెల్ల
మొనసి చెంచులకెల్ల - ముఖ్యుఁడై, చాల
*సిరుల నొప్పుచునుండు - శిఖినాయకునకుఁ
*ప్రేమ నిద్దఱ మాఁడు - బిడ్డల మగుచుఁ
బుట్టితి; మందులోఁ - బుణ్యంబు చేసి
నట్టి మాయక్క ఘో - రారణ్యమందు
వేఁటాడఁ జూచి య - వ్వేలఁదిపైఁ బ్రేమ
నాఁటించి తరిగొండ - నరమృగేంద్రుండు
మిక్కిలి వగకాఁడు - మీసాల పోతు
మక్కువమీఱ న - మ్మగువను జేరి,
బేలించి, వలపించి, - ప్రేమఁ బుట్టించి,
లాలించి, తేలించి, - లక్ష్మిగా నెంచి,
ప్రేమాతిశయమునఁ - బెండ్లిఁ జేసికొని,
కామభోగానంత - కలితాత్ముఁడయ్యె;
నటమీఁద వింధ్యాద్రి - యందుండి వచ్చి
వటుక రూపమువాఁడు - వరియించె నన్ను;
వాఁడు, నే నిందుండి - వరుసగా వేఁట
లాడుచు వచ్చి, నే - నతనిఁ గానకను
వనమెల్ల వెదకుచు - వచ్చితి, నతని
నొనరఁ జూచినఁ జెప్పుఁ - డో యన్నలార!

* *ఈ రెండు ద్విపద పంక్తులు ప్రాసమైత్రిరహితంగా సాగాయి.

ద్వారపాలకులు :

ఆ.వె. మొనసి నీకుఁ దగిన పెనిమిటి నిందెందు
మేము చూడలేదు మీననయన!
నీవు వాని గుఱుతు లీవేళ వరుసగాఁ
జెప్పు, చూచియుంటె చెప్పఁగలము. 3

## చెంచెత పెనిమిటి స్వరూపము

**చెంచిత:**

సీ. వాఁడెట్టివాఁ డంటె పేడిగడ్డము వాఁడు
మిట్ట నొసలు వాఁడు, పొట్టివాఁడు
కుంటిచేతుల వాఁడు, గొంటుమాటల వాఁడు
పిల్లికన్నుల వాఁడు, కల్లరీఁడు
ఉంటపొక్కిలి వాఁడు, ఊఁచపిఱ్ఱల వాఁడు
దొప్ప చెవుల వాఁడు, దుండగీఁడు
బానకడుపు వాఁడు, గూనిపోయిన వాఁడు
గట్టి విల్లమ్ములు పట్టినాఁడు

తే.గీ. ప్రకట తరిగొండహరికి షడ్డకుఁడు వాఁడు
హెచ్చి నావెంట వచ్చి వేఁటాడ నేఁడు
పొసఁగ ననుఁగాన కెచటికో పోయినాఁడు
మీరు చూచినఁ జెప్పరే! ధీరులార! ౪

ద్వారపాలకులు:

తే.గీ. చేడె! యిటువంటి *వానెందుఁ జూడలేదు;
మంచి దా మాట లటులుంచు, చెంచువారు

* 'వానిన్+ఎందున్'- అని పద విభజనము. ఇది వ్యావహారికమైన సంధిరూపము.

నిలిచి విహరించు చోటులు నిజముగాను
నీవు దెలుపవె! వరుసగా నీరజాక్షి! ౫

## చెంచులు విహరించు చోటులు

### దరువు - ఆది తాళం

**చెంచిత:**

మా చెంచులున్న చోటు లోలాలా! నేను
చూచినంతలొ చెప్పె నోలాలా! 1

**ద్వారపా:**

మీ చెంచులున్న దిక్కు లో బాలా! నీవు
చూచిన వెల్లఁ దెలుపు మో బాలా! 2

**చెంచిత:**

వింధ్యాద్రిపై నుందు రోలాలా! వారు
వేదాద్రిపై చరింతు రోలాలా! 3

**ద్వారపా:**

ఇంకా యెక్కడ నుందు? రో బాలా!
కొంకక ముదముతోఁ దెల్పు మో బాలా! 4

**చెంచిత:**

గరుడాద్రిమీఁద నుందు రోలాలా!
వారు కనకాద్రిపై చరింతు రోలాలా! 5

**ద్వారపా:**

మఱి యింకెక్కడ నుందు? రో బాలా!
మఱుఁగు పెట్టక తెల్పు మో బాలా! 6

చెంచిత:

సింహాద్రిమీఁద నుందు రోలాలా! వారు
శ్వేతాద్రిపై చరింతు రోలాలా! 7

ద్వారపా:

తరిగొండాధిపుని కరుణ నో బాలా!
చెంచు లరసి యింకెచట నుందు? రో బాలా! 8

చెంచిత:

ద్విపద. వినుఁ దన్నలార! యా - వృత్తాంతమెల్ల
మనము రంజిల్లఁగా - మా చెంచువారు
మహిమలచే నొప్పు - మలయాద్రియందు
తుహినపర్వతమందు - ద్రోణాద్రియందు
మంగళగిరియందు - మందరమందు
శృంగవంతమునందు - శ్రీశైలమందు
పెదయహోబళమందుఁ - బేరుగా వెలసి
వదలక మా చెంచు - వారుందు రెపుడు.
పలుమాఱు నిన్ని చె - ప్పఁగ నేల? యిపుడు
పొలుపొందునట్టి జం - బూద్వీపమందు
వరుసగా మా చెంచు - వారు శోధించి
యెఱుఁగని గిరులు లే, - విదియును గాక
భువి నొప్పునట్టి జం - బూద్వీపమునకు
నవలఁ బ్లక్ష ద్వీప - మాది చేసికొని
తివిరి యా పుష్కర - ద్వీపంబు దనుక
జవమొప్పఁ బోదుము - జలధులు దాఁటి,

సరవి శుద్ధోదక - జలరాశి కవల
నరుదైన చక్రవా - ళాద్రిపై కెగసి
విహరింతు, మచ్చటి - వింత యేమనిన
నహహా! మహామేరు - వగ్రమం దిరుసు
తగిలించియుండది, - దాని మూలమున
నిగనిగ మనును *గా - నిఁగ చందముననుు,
*వలనొప్ప నా చక్ర - వాళాద్రి కివలఁ
*గనిపించు, నావల - గాఢాంధతమము
గప్పియున్నది; దానిఁ - గడచిపోలేక
తెప్పున నందుండి - తిరిగి యిక్కడికి
వచ్చి మా తరిగొండ - వాసుని దయను
విచ్చన మే మిట - విహరింతు మెపుడు.

### దరువు - ఆది తాళం

మంచి మంచి గట్టు లెక్కే - చెంచువార మోలాలా!
పొంచి పొంచి వేఁట లాడే - చెంచువార మోలాలా! 1

మింటికైనా నెగురఁబ్రాఁకే - చెంచువార మోలాలా!
జుంటితేనె పెరలా దించే - చెంచువార మోలాలా! 2

సింగములా నెత్తిమొట్టే - చెంచువార మోలాలా!
చిఱుతగండ్ల నదిమిపట్టే - చెంచువార మోలాలా! 3

---

* 'గానుఁగ'కు వ్యావహారిక రూపము.

** ఈ రెండు పంక్తులు దేనికది విడివడిగా (ప్రాసమైత్రి లేక) ఉన్నాయి.

గండభేరుండములఁ గట్లే - చెంచువార మోలాలా!
గజములాను ఒడిసిపట్టే - చెంచువార మోలాలా! 4

ఉరగాద్రి పతినిఁ గొలిచే - చెంచువార మోలాలా!
తరిగొండ పతినిఁ గొలిచే - చెంచువార మోలాలా! 5

వ. అనిన విని హరి ద్వారపాలకులు దానిం జూచి 'చెంచిత! నీవు చక్రవాళాది పర్వతముల పర్యంతము ఎఱుఁగుదు నంటివి గదా! అన్నిటికి నడుమగా నుండే మహామేరు పర్వతము చుట్టునుండే పర్వత,వర్ష వృత్తాంతములఁ జెప్పు'మనఁగా నది యిట్లనుచున్నది: ౖ

## వేర్వేరు పర్వతముల, వర్షముల విశేషములు

ద్విపద. వినుఁ డన్నలార! శ్రీ - విష్ణు విభూతు
లనఁదగు సప్తతో - యధుల, దీవులను
కొలఁదిఁ బెట్టుటకు నా - కు నసాధ్య, మైనఁ
దెలిపెద నొకకొంత - తెలిసినయంత
పొలుపొందుచుండు జం - బూద్వీప మొనర
బలముగా వెలయు భూ - పంకజమునకుఁ
దెఱఁగొప్ప మధ్య ప్ర - దేశంబునందు
సరసమై లక్షయో - జనము వెడల్పు
నెలవొప్ప నంతియె - నిడుపును గలిగి
సలలితంబైన జల - జంబు చందమునఁ
గరమొప్ప వర్తులా - కారమై యుండు.
వరుస నిలావృత - వర్షంబు దానిఁ
గదిసి యా చుట్టుఁ బ్ర - కాశింపుచుండు.

వదలక తరిగొండ - వాసుఁడై ధరను
ఇరవైన శ్రీవేంక - టేశుని కృపను
వరుసగా నవి చూచి - వత్తు మోరన్న!

**ద్వారపా:**

వ: అయితే, చెంచితా! పశ్చిమోత్తర మూలయందుండే వర్ష పర్వత వృత్తాంతంబులు చెప్పుము.

అనినఁ జెంచిత యిట్లనియె: ౭

### ఝంపె

కనకగిరికిఁ దూర్పున గంధమాదనశైల
మొనరుచున్నది చూడరోరన్నలారా! 1
పరఁగ నా గిరి నిడివి భద్రాశ్వ వర్షంబు
నొరయుచున్నది చూడరోరన్నలారా! 2
మొనసి మందర, జఠర, మేరుకూటనగంబు
లురుతరోన్నతములై యుండు నోరన్నలారా! 3
తరిగొండ హరియైన వరవేంకటేశ్వరుఁడు
చొరవ మా కది చూపు నోరన్నలారా! 4

వ. అనిన విని వారు చెంచితను 'పడమటి వృత్తాంతంబుఁ జెప్పు' మనఁగా నది యిట్లనుచున్నది: ౮

### దరువు

వరుణుని దిక్కుమూల.........వర్ష గిరీంద్ర మొప్పుచుండునో వోలాలా! 1
కేతుమాల వర్షగిరి నిడివిగానే యుండునో వోలాలా! 2
దాని ప్రభవో! దాని కావల పార్శ్వశైల మమరియుండునో వోలాలా! 3
దాని కవల పవనచాల పారియాత్ర పర్వతా మమరియుండునో వోలాలా! 4
తరిగొండ నారసింహుని దయచే నవి చూచివత్తుమో వోలాలా! 5

ద్విపద. పట్టుగా నుత్తర - భాగంబునందు
నెట్టన మెఱయుచు - నీలాచలంబు
*నరయ శ్వేతాద్రియు, - శృంగాద్రి యుండుఁ
దరమిడి వాటి మ - ధ్య ప్రదేశముల
మలయ రమ్యంబు, హి - రణ్మయ, కురువర్ష
ములును మనోహర - ములు నొప్పుచుండు.
పొలుపొందు దక్షిణం - బున నిషధాద్రి,
యలహేమకూట, హి - మాద్రులు, నవల
వరుణ దిక్కున, మధ్య - వన్యదేశముల
వరుసగాఁ దగి హరి - వర్ష, కింపురుష
భారతవర్షముల్ - ప్రబలుచునుండు,
నారయఁ దరిగొండ - హరియైన శేష
*గిరి నిలయునితోడ - వేఁటాడఁ బోయి
వరుసగా నవి చూచి - వత్తుమో రన్న!

వ. అనిన విని, చెంచితను 'సప్త సముద్ర వృత్తాంతంబులఁ జెప్పు' మనిన నది యిట్లనుచున్నది: ౯

**దరువు**

**తెలియ జంబూ, ప్లక్ష, కుశద్వీపములఁ జూతు మోలాలా!**

**ఇంకా యేమి**

**క్రౌంచ, శాకాది, శాల్మల, పుష్కర ద్వీపములఁ జూతు మోలాలా!॥తెలియ॥** 1

**మేము**

**మొనసి లవ, ణేక్షు, సురాసముద్రములు చూతు మోలాలా! ॥తెలియ॥** 2

* *ఈ రెండు పాదాల్లో యతిమైత్రి తప్పింది.

సర్పి, దధి, క్షీర, నీర సాగరములను మేము చూతు మోలాలా! ॥తెలియ॥3
తరిగొండ నరసింహు కరుణా నిండి మేము చూతు మోలాలా! ॥తెలియ॥4॥

వ. అదిగాక, స్వర్ణప్రస్థద్వీపంబును, నావర్తన ద్వీపంబును, రమణక ద్వీపంబును, మందహరణ ద్వీపంబును, పాంచజన్య ద్వీపంబును, సింహ ద్వీపంబును, లంకాద్వీపంబును,......ద్వీపంబును ననఁదగునట్టి యుప ద్వీపంబు లెనిమిది చూచివత్తు మోరన్నా!

## ✳ చెంచిత అమాయికత ✳

అయితే, యిట్లనేక పర్వతంబులు చూచి వచ్చితి. ఈ పర్వతంబు మహావింతయై యుండది. అది యెట్ల నంటె, నాల్గు దిక్కుల చదురమై, యిరుగెలంకుల పెట్టెలు చేర్చినట్లా వుండవి. యివి యే కొండలురా? అన్నయ్యా! ౧౦

**ద్వారపా:**

వ. ఇవి స్వామి వేంచేసే తిరువీథులకు ఉభయపార్శ్వంబులయందు పరమ భాగవతులు వసియించియుండే మందిరశ్రేణులు గాని, కొండలు గావే చెంచుభామా! ౧౧

**చెంచిత:**

వ. అయితే, వోరన్నా! యీ పలకకొండ లేమిరా? ౧౨

**ద్వారపా:**

వ. ఇవి కోవెల ప్రాకారంబులు గాని, పలకకొండలు గావే! చెంచుభామా! ౧3

**చెంచిత:**

వ. అయితే, యీ నిడివి కొండలు యేమిరా? అన్నయ్యా! ౧౪

**ద్వారపా:**

వ. ఇవి గోపురంబులు గాని, నిడివి కొండలు గావే! చెంచుభామా! ౧౫

**చెంచిత:**

వ. అయితే, పచ్చ పచ్చగా రేలపువ్వుల వన్నె గలిగి, నిగనిగ మెఱసే యీ కూచగుట్ట లేమిరా? అన్నయ్యా! ౧౬

**ద్వారపా:**

వ. ఇది పరబ్రహ్మ నిర్మితంబైన వైకుంఠమందుండి దివ్యవిమానాభిధానమున వచ్చిన ఆనందనిలయంబుగాని, కూచగుట్టలు గావే! చెంచుభామా! ౧౭

**చెంచిత:**

వ. అయితే, యీ ఆనందనిలయంబులో వుండేవాఁడెవఁడు రా? ౧౮

**ద్వారపా:**

వ. ఈ యానందనిలయంబులో నుండే స్వామి అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండైన శ్రీవేంకటేశ్వరుండే చెంచుభామా! ౧౯

**చెంచిత:**

వ. అయితే, యెక్కడఁ జూచినను యెఱ్ఱగా, తెల్లగా నల్లగా, పచ్చగా, తళుకు బెళుకులు గలిగి రెండు కాళ్లతో నడచే మెకంబు లుండవి; నేను వేఁటాడుదు నటరా? వోరన్నా! ౨౦

**ద్వారపా:**

వ. అయితే, వీరందఱూ హరికి సేవఁజేసే పరమభక్తులుగా నుండే నరులు గాని, నీవు వేఁటాడే మృగంబులు గావే! చెంచుభామా! ౨౧

**చెంచిత:**

వ. అయితే, రెండు కాళ్లు, నాలుగు చేతులు గలిగియుండే మీ రిద్దఱు యెవ్వరురా? వోరన్నా! ౨౨

**ద్వారపా:**

వ. మే మిద్దఱము జయవిజయాభిధానంబులు గలిగిన యీ శ్రీవేంకటేశ్వరుని ద్వారపాలకులమే! చెంచుభామా! ౨౩

## ✳ చెంచిత కోరిక ✳

**చెంచిత:**

వ. అయితే, శ్రీవేంకటేశ్వరునిఁ జూడఁగోరెద. చూపరే! యన్నలారా! ౨౪

### దరువు - ఆది తాళం

**సామినిఁ జూపరె! సాములారా! మీ**
**సామినిఁ జూపరె! సాములారా!** ॥పల్లవి॥

**మిమ్ము**

**భూమిలో నెంచేము పుణ్యులారా!**
**సామినిఁ జూపరె! సాములారా!** ॥ఉపపల్లవి॥

**సిస్తైన పుట్టాదుతలను - చికిలి పిల్లులాను ఇపుడు**
**కస్తూరి మెకములాను - కానుక మీకిచ్చేఁగాని** ॥సామిని॥ 1

చెంగు చెంగున దాఁటి, భు - జంగమూల నొడిసి పట్టి
పొంగి పొంగి యాడుచుండే - ముంగిసాలఁ దెచ్చిచ్చేఁగాని ॥సామిని॥ 2
ఉరగశైలాధీశుఁడైన - తరిగొండ నరహరిని దొరయుచు
నటించే జల్లి మెల్ల- మెకమూలఁ దెచ్చిచ్చేఁగాని ॥సామిని॥ 3

వ. అనిన, వారు చెంచితను జూచి, ' మీ పెండ్లిండ్ల వృత్తాంబులు చెప్పు' మనినఁ, జెంచిత యిట్లనుచున్నది: ౨౫

## ✳ చెంచువారి పెండ్లిండ్లు ✳

ద్విపద. వినుఁడు మా పెండ్లిండ్ల - విధముఁ జెప్పెదను
పెనుపొందఁగాఁ బెండ్లి - పెద్దలు కూడి
అదను పుప్పొడిఁ బెండ్లి - యరుఁగులు దీర్చి
కుదురుగాఁ దేఁకుటా - కుల తెరల్ గట్టి
బలుపూల కొమ్మలఁ - బందిళ్లు వెట్టి
ఇల నొప్పు పెదహోబ - లేశునిఁ దలఁచి
చినహోబలేశునిఁ - జేరి పూజించి
వనదేవతలకెల్ల - వరుసగా మ్రొక్కి
కందమూలమ్ములు - కలమాఁగు పండ్లు
పందుల మాంసంబు - పక్షి మాంసంబు
చిఱుతల మాంసంబు - జింక మాంసంబు
కరివైరి మాంసంబు - కడితి మాంసంబు
మొదలగు బహుమాంస - ములు కూడఁబెట్టి
అదిగాక వెదురు బి - య్యము, తేనె, పెరుఁగు,
పులిజున్ను తెప్పించి - పొసఁగ వండించి
చెలఁగి యాదగిరయ్య - సింహాద్రినాయ్డు

శిఖి నాయకుండును - సింగమనాయ్డు
బక నాయకుండును - బంగారు నాయ్డు
కాటమనాయుఁడు - గంగమ నాయ్డు
జూటారినాయుఁడు - జోగుల నాయ్డు
ఓబిళ్ల నాయుఁడు - నుద్దండనాయ్డు
జాబిల్లినాయుఁడు - జంగమనాయ్డు
బొమ్మినాయుఁడు, డొంకు - బొక్కుల నాయ్డు
తిమ్మినాయుఁడు, దొమ్మి - తిక్కరి నాయ్డు
ములుకులనాయుఁడు - మొదలైన చెంచు
కులపెద్దలందఱు - గుంపులు గూడి
పెద్ద చెంచెతలను - బిక్కి చెంచెతల
ముద్దు చెంచెతలను - ముసలి చెంచెతలఁ
బెండ్లి కుమారునిఁ - బెండ్లికూఁతురును
పెండ్లి పందిటిలోకి - పిలుచుక వచ్చి
తళుకైన దంతి దం - తముల కమ్మలును,
కళలీను సంకుటుం - గరములు, బండి
గురిగింజ దండలు, - కోరదండలును,
విరిజాజి, కస్తూరి, - వెలలేని పునుఁగు,
కోరిన పాఱుటా - కుల చీర లిచ్చి
గారవం బెసఁగ శృం - గారంబు చేసి
వలనొప్పఁ దప్పెట్లు - వాయించుకొనుచుఁ
బొలుపొంద నడి మింట - పొద్దుండఁ జూచి
మెఱయ దంతపు బొట్టు - మెడను గట్టించి
పరఁగఁ బువ్వులఁ దలం - బ్రాలు పోయించి

గూడె గూడెమువారు - కూడందుఁ గుడిచి
కూడఁగట్టుదురు మ - క్కువను దీవించి,
*తరిగొండ నరహరి - దయచేత మేము
నెళవుగాఁ బెండ్లిండ్లు - నెఱవేర్తు మెపుడు
వెలయు మా పెండ్లిండ్ల - విధమిట్ల నన్న!
శ్రీవేంకటేశుని - సేవింపవలయు
వేవేగఁ జూపరే! - విమలాత్ములార!

ద్వారపా:

క. తరిగొండాధీశ్వరుఁడై
యిరవుగ నిందున్న వేంకటేశుని కొసఁగన్
గురుతర కానుక లిప్పుడు
నరులెన్నఁగ నేమి తెచ్చినావే? తరుణీ! ౨౬

చెంచిత:

క. అడవులలో విహరించుచు
విడిబడి మెకములను నేఁడు వేఁటాడుచు మా
కడుపులు సాకుట కష్టము,
కడుకాన్కలు మాకు లేవు గదరోరన్నా! ౨౭

## సంవాద దరువు

చెంచిత:

వేడుకగా నే నిప్పుడ సామిని - జూడఁదలఁచినా నన్నా!
నేఁ జూడదలఁచినా నన్నా! 1

* ఈ పాదంతో పాటు ఇక్కడ ర కారప్రాసగల మఱొకపాదం ఉండియుండవలె. అయినా, ఇక్కడ అర్థలోపమేమీ గోచరించటం లేదు.

ద్వారపా:

చేడెరొ! కానుక లియ్యక - స్వామినిఁ జూడనియ్యమే! కొమ్మా!

మా స్వామినిఁ జూడనియ్యమే! కొమ్మా! 2

చెంచిత:

ఈడనె కస్తూరి, జవ్వాదియుఁ, బునుఁ - గిచ్చెదఁ గొనుఁడోరే!యన్నా!

నే నిచ్చెదఁ గొనుఁడోరే! యన్నా! 3

ద్వారపా:

పోఁడిమిగా నివు దవి యొల్లము - పోవే! ముద్దుల గుమ్మా!

నీవు పోవే! ముద్దుల గుమ్మా! 4

చెంచిత:

పుట్టతేనె, బలు పులిజున్నిచ్చెద - నెట్టనఁ గొనరోరన్నా!

మీరు నెట్టనఁ గొనరోరన్నా! 5

ద్వారపా:

గట్టిగ నవి మే మొల్లము, మొల్లముగాఁ - గల్గిన వోహో! కొమ్మా!

మాకు మొల్లముగాఁ గల్గిన వోహో! కొమ్మా! 6

చెంచిత:

తఱచుగ శేషాచలపతి కిప్పుడు - తనుధన మిచ్చెద నన్నా!

నా తనుధన మిచ్చెద నన్నా! 7

ద్వారపా:

తరిగొండాధీశ్వరునకు పచ్చని - ధనము కావలెనమ్మా!

మంచి ధనము కావలెనమ్మా! 8

**చెంచిత:**

క. తిను మెకముల వేఁటాడుచు
వనములలో నుండు చెంచువారము, మాకున్
ధన మేడనుండి వచ్చును?
నను సామినిఁ జూడనిండు! నయగుణులారా! ౨౮

**ద్వారపా:**

క. విను! మ్లేచ్ఛాధీశ్వరునకు
గొనకొని హరి కోరినట్టి గుప్తపదార్థం
బునఁ బదివే లిపు డియ్యక
నిను సామినిఁ జూడనియము నీరజనేత్రీ! ౨౯

## ✳ తుంబురుకోన - వేంకటేశ్వరుఁడు ✳

**చెంచిత:**

ద్విపద. వినరన్న! నే నొక్క - వేంకటేశ్వరుని
గొనకొని చూతు మా - కోనలోపలను;
ఆ వేంకటేశ్వరుఁ - డధికుఁడో, కాక
యీ వేంకటేశ్వరుం - డెక్కువో? రెండు
తెలియఁ జూతమటంచుఁ - దెఱఁగొప్ప మదినిఁ
దలఁచెద నెపుడు, శ్రీ - తరిగొండ హరికిఁ
దొలినుండి తగిన బం - ధువులము గనుక
నెలమితో మీ స్వామి - నిం జూపరయ్య!

## సంవాద దరువు

**ద్వారపా:**

ఏ కోనలో మీరు వో బాలా!- యెలమి నుందు రెపుడు వో బాలా? 1

**చెంచిత:**

తుంబురు కోనలో వోలాలా!- తొలఁగకుందు మెపుడు వోలాలా! 2

**ద్వారపా:**

ఇపుడు కోనలో వో బాలా!- యేల నుందు రెపుడు వో బాలా? 3

*****************************************************

**చెంచిత:**

అరఁటిపండ్లు గలవూ వోలాలా! పరికిపండ్లు గలవూ వోలాలా! 4

**ద్వారపా:**

ఇంక నేమి గలవె? వో బాలా!- యింపుమీఱఁ దెల్పవె! వో బాలా! 5

**చెంచిత:**

పనసపండ్లు గలవూ వోలాలా!- పాలపండ్లు గలవూ వోలాలా! 6

**ద్వారపా:**

మఱిన్నేమి గలవే? వో బాలా!-మరువకుండా దెల్పవె! వో బాలా! 7

**చెంచిత:**

ద్రాక్షపండ్లు గలవే! వో లాలా!-దాది మాఁకులు గలవే! వోలాలా! 8

**ద్వారపా:**

మీకు దేవుఁ డెవరే? వో బాలా!-మాకుఁ దెల్పు మిపుడు వో బాలా!9

******* ఈ గుర్తులు గలచోట చెంచిత ప్రత్యుత్తరము గల వాక్యము, ద్వారపాలకుల ప్రశ్నగల వాక్యము- వెరసి రెండు వాక్యాలు లుప్తమైనట్లు భావింపబడుతున్నది.

చెంచిత:

తరిగొండాధిపుఁడు వోలాలా!-దైవమయ్య! మాకు వోలాలా!

ద్వారపా:

తే.గీ. వెలఁది! తుంబురుకోనలోఁ గలిగినట్టి
మహిమలే? మిపు డచట సమ్మతముగాను
కోరి విహరింపు చుండేటి వార లెవరె?
తెలుపవే! చెంచుభామ! సందియము లేక.

చెంచిత:

ద్విపద. విమలాత్ములార! నే - వినిపింతు వినుఁడి!
కొమరైన తుంబురు - కోనలో నెపుడు
వలనొప్పఁగా జాతి - వైరముల్ విడిచి
పులులు, నావులు గూడి - పొదలలో మెలఁగు,
కరిసమూహములును, - కంఠీరవములు
సరసంబు లాడుచుఁ - జరియింపుచుండు,
చండఖడ్గ, వరాహ, - శరభ, భల్లూక
గండభేరుండాది - ఘనమృగావళులు
పరువడి నాగాది - ఘన భుజంగములు,
గరుడాదిగా విహం - గమ సమూహములు
గొనకొని నిరతంబు - కూడియాడుచును
వనమెల్ల విహరించు - వైరంబు లేక,
అరుదైన దివ్య పర - మౌషధలతలు
మురువొప్పు మణిదీప - ముల మాడ్కి వెలుఁగు;

మహి నొప్పు గంగా స - మానంబు లగుచు
బహుపుణ్య తీర్థముల్ - ప్రవహించు నచట,
మును లంద ఆ తీర్థ - ములయందు మునిఁగి
పనిఁబూని తమతమ - పర్ణశాలలను
కొందఱు కను మూసి - గొణఁగుచుందుదురు
కొంద ఱేమేమొ - కూయుచుందుదురు,
కొంద ఱచ్చట గుమి - గూడి, కుంపట్లు
ముందర నిడుకొని - మ్రొక్కుచుందుదురు,
కొందఱు వాయువుల్ - కుంభింపుచుంద్రు,
కొందఱు కనుగ్రుడ్లు - గూర్చి నిల్పుదురు;
వెలయఁగా నపుడు మా - వేంకటేశ్వరుఁడు
తొలఁగక వారి ముం - దర నాడుచుండు,
*మురిసి యేకాంత మే - మో చెప్పుచుండు;
తరిగొండ నరహరి - దయచేత మేము
చొరవగా నవి యెల్లఁ - జూతు మో రన్న!

## దరువు

**ద్వారపా:**

వేంకటేశుఁడందో వో బాలా! యింక నేమి జేయునో? వో బాలా! 1

**చెంచిత:**

జడల మునులందో వోలాలా! - సంచరించు నతఁడో వోలాలా! 2
భూరి భూజములకో వోలాలా!-ప్రోదిఁబెట్టు నతఁడో వోలాలా! 3

---

'ర' కార ప్రాసగల పాదం ఒకటి ఇక్కడ ప్రతిలో లోపించినట్లు తెలుస్తున్నది.

ప్రజల మీఁద నతఁ డెపుడో - పరువు లెత్తు నతఁడో వోలాలా! 4
చెంచు చెలులతోనూ వోలాలా!-మించి నవ్వు నతఁడో వోలాలా! 5
తరిగొండాధిపుఁడో వోలాలా!-మురిసి మమ్ము నేలునో వోలాలా! 6

ద్వారపా:

కోమలీమణి! మీరున్న కోనలోకి
వచ్చునటువంటి వేంకటేశ్వరుఁడు నెట్టి
వాఁడు? నీ వా విశేషముల్ వరుసగాను
మొనసి తెల్పఁగదే! చెంచు ముద్దుగుమ్మ! ౩౧

చెంచిత:

ద్విపద. వినరన్న! నేఁ జూచు - వేంకటేశ్వరుఁడు
మినమినమని చాల - మెఱిసేటి దేమొ
గట్టిగా తలమీఁద - గదియించి, దాని
చుట్టు పూదండలు - చుట్టుకొన్నాఁడు
లలిమించు మొసలి పి - ల్లల వంటివేమొ
తళుకుగా చెవులకు - తగిలించినాఁడు
పచ్చపచ్చటిదేమొ - బహుశాన మేన
అచ్చుగా నందందు - నతికించినాఁడు
పల్లని కూసేటి - గట్లు శ్రీపాద
పల్లవములయందు - భరియించినాఁడు
గుండూటి దొక్కటి, - కూసేటి దొకటి
రెండుచేతులను ధ - రించి యుండాఁడు
ఎడమచేతను కత్తి - యిరవందఁ బట్టి
కుడిచేత ధరణిపై - గుఱిఁ బెట్టినాఁడు

నల్లని మొయిలు వ - ర్ణము గలవాఁడు
తెల్లనై తగు పట్టె - తిరుమణివాఁడు
కలికి చూపుల గొప్ప - కన్నులవాఁడు
మొలక నవ్వులవాఁడు - ముద్దులవాఁడు
పసపుఁ బూసిన పొఁత - పై హొయల్ మీఱ
విసువక వలెవాటు - వేసి వేడుకను
ప్రాకటంబుగ నొక - పక్షిపై నెక్కి
మా కోనలకు వచ్చు - మమ్మెల్ల మెచ్చు
నలువొప్ప తరిగొండ - నరసింహుఁడగుచు
వెలయు మమ్మేలు నా - వేంకటేశ్వరుఁడు.

**దరువు - ఆది తాళం**

**ద్వారపా:**

వేంకటేశ్వరుఁడు వచ్చినపుడు - వేడుకతో మీ రెటు సేవింతురో?
వో బాలా! 1

**చెంచిత:**

వచ్చినపు డా సామికి మేము - హెచ్చుగ పదములు గడుగుచుందుమో
వోలాలా! 2

**ద్వారపా:**

పంకజోదరుని పదములు గడిగి,-యింకా మీ రేమి సేతురో?
వో బాలా! 3

**చెంచిత:**

పాఱుటాకుల పందిటిలోకి - కోరి పిలుచుకపోదు మతని వోలాలా! 4

ద్వారపా:

కోరి పిలుచుకపోయిన స్వామిని - కూరిమితో మీరెటు సేవింతు?
రో బాలా! 5

చెంచిత:

మల్లెపువ్వుల పానుపుఁ బఱచి - చల్లఁగ మే మందుంతు మతని
నోలాలా! 6

ద్వారపా:

చల్లఁగా నందుంచిన హరికి సవరని పూజ - లెల్ల ఎట్లా జేతురో?
వో బాలా! 7

చెంచిత:

పొగడపువ్వుల దండలు వేసి - పొన్న పూలతో పూజలు చేతుమో
వోలాలా! 8

ద్వారపా:

పూజ చేసిన స్వామికి మీరు- భుజియింప నేమేమి యిత్తురో? వో బాలా! 9

చెంచిత:

తియ్యని మామిడిపండ్ల రసమూ, - తేట జుంటితేనె లిత్తుమో వోలాలా! 10

ద్వారపా:

ఆరగించినా తరిగొండాధిపుఁ - డావల నందేమి జేయునో? వో బాలా! 11

చెంచిత:

ద్విపద. వినుఁ డన్నలార! శ్రీ-వేంకటేశ్వరుఁడు
గొనకొని యొడిఁగట్టి - కొని వచ్చినట్టి
కప్పూర బాగముల్ - గరగర నమలి

యప్పుడా విడెము మా - కందతీ కిచ్చి
కోడెగాఁడై మమ్ముఁ - గూడి కొండలకు
వేడుకగాఁ దాను - వేఁటాడ వచ్చు,
పేటుల కెగఁబ్రాకు, - పెరలలో తేనె
మాటి మాటికిఁ దెచ్చు, - మాకెల్ల నిచ్చు,
పువ్వులు ముడుచుఁ, - బుప్పొడి మేన గుప్పు,
నవ్వుచుఁ గళలంటు, - నగుఁబాటుసేయు,
అదర మా చేతి వి - ల్లమ్ము లందుకొని
విడిబడి మెకముల - వేఁటాడి సొలయు,
'అలసితి' వనుచు మే - మలరుల శయ్య
వలనొప్పఁ బఱచి, యా - వరదు నందుంచి,
పునుఁగు పైఁబూసి, పు - ప్పొడి చాల నించి,
యొనరంగ మల్లెపు - వ్వులను పూజించి,
ఫలము లర్పించి, యా - పంకజాక్షునకుఁ
గులుకుచు నెమలీఁకె - కుచ్చెల విసరి,
పదసేవఁ జేయఁగా - బడలిక దేఱి,
అదిమొదల్ సరసంబు - లాడుచు మురియు;
వింతవింతలు జేయు, - వెలయు మాతోడ
పంతంబుతో నేల - పదములు పాడు,
మదన తంత్రాసక్తి - మది నుంచి మమ్ముఁ
గదియ నూహించుఁ, గే - కలువేసి నవ్వు,
మనము రంజిలఁ గూడి - మగుడి మాతోడ
గొనకొని మేమున్న - గూడెంబుఁ జేరు;
ఘనమైన జవ్వాజి - కస్తూరి, మంచి

పునుఁగు చట్టలు, - జాజి పువ్వుల చెండ్లు,
ముదమొప్ప నక్కకొ - మ్మును గొని మమ్ము
సదయుఁడై వీడ్కొని - సామాన్యముగను
*పచ్చిపై నెక్కి యీ - ప్రాంతంబునకును
వచ్చుచుండును గాన - వాఁడె వీఁడనుచు
దలఁచెద, నా పాలి - తరిగొండ హరిని
సొలయక దయచేసి - చూపుఁ డోరన్న!

తే.గీ. అనిన వారిటు లనిరి: హేమాంబరునకుఁ
బునుఁగు చట్టలు, కస్తూరి, పూల చెండ్లు,
అమర జవ్వాజి యిచ్చితి; రంతె చాలు,
నక్కకొమ్మేల? చెప్పవే! నలిననేత్రి! 3౨

**చెంచిత:**

క. *న క్కొమ్మింటిలో నుండిన
తక్కక నాయింటిలోన ధన మెడతెగకన్
క్రిక్కిఱిసియుండుఁ గావున
నక్కలతో నక్కకొమ్ము లా హరి దెచ్చున్. 33

## ✳ చెంచునాయకుని రాక ✳

వ. అనిన విని, ద్వారపాలకులు సంతసిల్లి, స్వామినిఁ జూడుమని సెలవిచ్చు సమయంబునఁ జెంచునాయుఁడు చెంచితను వెదకుచు వచ్చి యిట్లనుచున్నాఁడు: 3౪

---

* 'పక్షి' కి వికృతి 'పచ్చి'.

*' నక్క+కొమ్ము'- అని పద విభాగము. ఇది వ్యావహారిక సంధిరూపము.

## దరువు

వోవో చెంచితా! - వోహో వోహో చెంచితా! ॥పల్లవి॥

రావో రావో చెంచితా! - రావే! రావే! చెంచితా! ॥ఉపపల్లవి॥

విల్లు నమ్ములు చేతఁబట్టీ - వేఁటలాడే చెంచితా! ॥వోవో చెంచితా!॥ 1

కలికి చూపుల నన్నుఁ జూచే-మొలక నవ్వుల చెంచితా!
॥వోవో చెంచితా!॥ 2

మురిసి మురిసి నన్నుఁ గూడే - ముద్దు వగల చెంచితా!
॥వోవో చెంచితా!॥3

కొడుకును ముద్దాడుచు నుండే - కులుకు వగల చెంచితా!
॥వోవో చెంచితా!॥ 4

శ్రీతరిగొండాధీశుని - సేవఁ జేసే చెంచితా! ॥వోవో చెంచితా!॥5

## దరువు - ఆది తాళం

**చెంచిత:**

ఎందుఁ బోతి వింత తడవూ? చెంచునాయుఁడా!
ని, న్నెంతా నే వెదకితి నోయి! చెంచునాయుఁడా! 1

**చెంచునాయుడు:**

అడవిలో నిన్నుఁ గాన, కళికి చెంచితా! నేను
గడగడ వణఁకితిఁ గదవే! కలికి! చెంచితా! 2

**చెంచిత:**

యేల నీవు వెఱచితివి? చెంచునాయుఁడా! నీ
కేమి గానిపించెనోయి? చెంచునాయుఁడా! 3

చెంచునాయుఁడు:

వుడుత వెక్కిరింపవచ్చె కలికి! చెంచితా! నేను
'అబ్బా!'ని దద్దరిల్లితిని కలికి! చెంచితా! 4

చెంచిత:

వెఱపు నీకు తీతేటట్లా చెంచునాయుఁడా!
వేంకటేశ్వరునిఁ జూతామోయి! చెంచునాయుఁడా! 5

## ✳ చెంచునాయుఁడు చెంచితను వేంకటేశ్వరుని దర్శింపనీయక అడ్డుకొనుట ✳

చెంచునాయుఁడు:

వేంకటేశ్వరునిఁ జూడ వెఱతు చెంచితా!
వాఁడు, విటకాఁడంటా జెప్పాఁగా నే వింటి చెంచితా! 6

చెంచిత:

శ్రీతరిగొండాధీశుఁడు చెంచునాయుఁడా! అట్లా
చిన్నపని సేయఁడోయి చెంచునాయుఁడా! 7

చెంచునాయుఁడు:

సీ. వావి వర్తన లేక యీ వేంకటేశుండు
పరఁగ మేనత్తను బట్టెనంట!
అదిగాక, బహువల్లవాంగనామణులను
కరఁగించి సిగ్గులు చెఱిచెనంట!
చక్కని పడుచులై మ్రొక్కవచ్చినఁ దాను
మెడ బొట్టుఁ గట్టక విడువఁడంట!

ఆ నాఁడు మీ యక్క యగు చెంచెతను జూచి
మాయగాఁ బట్టుకపోయెనంట!

తే.గీ. కాన నిన్నట్టి జారుఁడు గాంచెనేని
నన్ను మఱపించు, రానీఁడు నిన్ను మగుడి
అవల దిక్కేది? తరిగొండ హరినిఁ జూడ
మించి పోవల, దిటు రావు చెంచుభామ! ౩౫

**చెంచిత:**

వ. కటకటా! చెంచునాయుఁడా! నీవిట్లా మోడిమాటలంటే విన సహింపదు. శ్రీ వేంకటేశ్వరుండు మహాయోగీశ్వరేశ్వరుండంటా వేదములు పలుకుచుండాయంటా మన తుంబురుకోనలోని జడల మునులు పలుకు చుండుదురు. కావున యీ మహాత్ముని జారుఁడంటే పాపంవచ్చు నోయ్యో! చెంచునాయుఁడా! ౩౬

**చెంచునాయుఁడు:**

వ. కటకటా! చెంచితా! యీ వేంకటేశ్వరుఁడు జారచోరశిఖామణి యని బహుమంది పెద్దలు చెప్పుచుండుదురు. కావున యీ విటకాని కండ్ల ముందరికి అబ్బబ్బా! మాయబ్బతోడే! నిన్ను పోనియ్యనే! చెంచుభామా!౩౭

**చెంచిత:**

వ. కటకటా! చెంచునాయుడా! యిట్లా మోడిమాట లననేల? నీవు నమ్మఁ జాలకుంటే, నా వెంటనే రావోయి! చెంచునాయుఁడా! ౩౮

**చెంచునాయుఁడు:**

వ. కటకటా! చెంచితా! శ్రీ వేంకటేశ్వరుండు నిన్ను నన్నుఁ జూచితే, నన్ను కట్టివేయించి, నిన్ను అపహరింపక మానఁడు. కాఁబట్టి, ఓ యబ్బా!

మాయబ్బతోడే! నే రా వెఱతు; నిన్ను పోనియ్యనే! చెంచుభామా! ౩౯

**చెంచిత:**

వ. నే నయినా పోయివచ్చేనయ్యా! చెంచునాయుఁడా! ౪౦

**చెంచునాయుఁడు:**

వ. కటకటా! నిన్ను చూడనియ్యనే! చెంచుభామా! ౪౧

**చెంచిత:**

వ. నన్ను యేమి సేయమనేవోయి? చెంచునాయుఁడా! ౪౨

**చెంచునాయుఁడు:**

వ. నాకు యిప్పుడు ఆకలి మెండు అవుతూవున్నది. యేమయినా తెచ్చి పెట్టవే! చెంచుభామా! ౪౩

**దరువు - ఆది తాళం**

**చెంచిత:**

**బిడ్డా నెత్తుకొ నీ వుండు చెంచునాయుఁడా! గెఱుసూ**
**గడ్డాలు తెచ్చిచ్చేనోయి! చెంచునాయుఁడా!** 1

**చెంచునాయుఁడు:**

**బిడ్డాను నే పట్టలేను పోవే! చెంచితా! గెఱుసూ**
**గడ్డా లెత్తూకోనీ వేగ రావే! చెంచితా!** 2

**చెంచిత:**

**కొడుకునూ లాలించవోయి! చెంచునాయుఁడా!** 3

**చెంచునాయుఁడు:**

కొడుకూనూ నే పట్టలేనూ పోవే! చెంచితా! వీణ్ణి
గుట్టూరాళ్ల నడుమా పెట్టిపోవె! చెంచితా! 4

**చెంచిత:**

శ్రీతరిగొండ నరహరికి చెంచునాయుఁడా! వీఁడూ
దాసూఁడోయీ! తిట్టవద్దు చెంచునాయుఁడా! 5

## దరువు - ఆది తాళం

**చెంచిత:**

చన్ను తాగరా! నా కొడుకా! ॥చన్ను॥ పల్లవి॥
తిండీ మీ యబ్బ కేమో – తెచ్చిపెట్టవలెనంటా ॥చన్ను॥ ఉపపల్లవి॥

ఘోరారణ్యాములో చెంచు-వారికిఁ బుట్టి నీవు
పోరు పెట్టుచుండినాను – పోకతీఱదేమిసేతూ? ॥చన్ను॥ 1

మేలయినా నీ బొజ్జా నిండా – వొప్పుగా కనిపించేటటుల
పాలు చేపు వచ్చినాది- బంగారు నాచిన్ని కొడుకా! ॥చన్ను॥ 2

తరిగొండా శ్రీనరసింహుని – కరుణా గల్గి చాలా నీవూ
సలలితముగా నన్ను – సంరక్షణ చేసేటి నా కొడుకా! ॥చన్ను॥ 3

## దరువు - అట తాళం
## జోలపాట

కడుపూ నిండుచ పాలు – కంఠమానెను, చాలు
గారాబు నా పట్టి! జో!జో! ॥పల్లవి॥

తడవూ నినుఁ గన్నా మీ - తండ్రి తొడలమీఁద
మోదముగా పవళించూ జో! జో! 1

పొలుపొందఁగా మా - కుల ముద్దరించుటకుఁ
గల ముద్దులాపట్టి! జో! జో! ॥ 2

తెలివిగల ధరణీపై - దీర్ఘాయువుగాను
వర్ధిల్లు నాపట్టి! జో! జో! ॥ 3

బలమొప్పఁగా పుత్ర - పౌత్రాభివృద్ధినా
ప్రబలూరా! నా పట్టి! జో! జో! ॥ 4

చెలఁగి తరిగొండ నర - సింహుని వరముచేత
పుట్టిన బాలా! జో!జో! ॥ 5

వ. అని యిట్లు జోలలు పాడి కొడుకును నిదురపుచ్చి, చెంచునాయునికి ఒప్పగించి, చెంచిత విల్లునంబులు చేతఁబట్టిపోయి చుట్టూ ముట్టూ వేఁట లాడుతూవున్న సమయంబున, వొక పులి వచ్చి చెంచునాయుణ్ణి బెదరించి శిశువును గొనిపోయిన తరువాత, చెంచునాయకి వచ్చే విధం బెటువలెను.ళళ

## ✳ పులి యెత్తుకొనిపోయిన కొడుకును గూర్చి చెంచిత యారాటము. ✳

### దరువు - ఆది తాళం

**చెంచిత:**

పెడబొబ్బలు బెట్టితీవి చెంచునాయుఁడా! చిన్నీ
కొడుకూ నేడా నీఁగితివి? చెంచునాయుఁడా! 1

**చెంచునాయుడు:**

కడుపింతైనా పెద్ద పులి చెంచునాయకీ! నీ
కొడుకు నెత్తుకొని అడవికి వురికే చెంచునాయకీ! 2

**చెంచిత:**

దొడ్డవిల్లూ, అంబు లుండగ చెంచు నాయకా!
చిన్ని, కొడుకు నెట్లా యిస్తివోయి? చెంచునాయకా! 3

**చెంచునాయుఁడు:**

బిడ్డ పోతే పీడఁబోయె లేవె! చెంచితా! నే
దొడ్డగా బ్రదికింది చాలూ పోవే! చెంచితా! 4

**చెంచిత:**

శ్రీతరిగొండ నరహరికి చెంచునాయుఁడా! యింత
దయలేకుండా పోయె నేమో? చెంచునాయుఁడా! 5

**చెంచునాయుఁడు:**

వ. కటకటా! చెంచితా! బిడ్డకొఱకు నీవు చింతింపఁబనిలేదు. నేను బ్రతికియుంటే చాలు, ఇట్లా బిడ్డల నెంతైనా పుట్టించేఁ గాని, కడుపునిండా యేమైనా తెచ్చిపెట్టు! ౪౫

వ. అనినఁ జెంచునాయుని వెఱ్ఱితనంబునకు నావేశంబు వచ్చి, ధిక్కరింప నూహించి, పతివ్రతా ధర్మంబున నేమి యన లేక, తన పుత్రునిఁ దలంచి చెంచిత యిట్లనియె: ౪౬

### దరువు - ఆది తాళం

పుట్టీ పుట్టాకమునుపె నా చిన్నీ కొడుకా!
వో చిన్నీ కొడుకా! ॥పల్లవి॥

నీకు, పులిగండ మేడా రాసె? నా చిన్నీ కొడుకా!
వో చిన్నీ కొడుకా! ॥ఉప పల్లవి॥
పాలు చేపూ వచ్చె నా చిన్నీ కొడుకా!
వో చిన్నీ కొడుకా!
నే, నే బాలూల కిత్తురా? నా చిన్నీ కొడుకా!
వో చిన్నీ కొడుకా! 1
యెన్నో నోమూలు నోచి నా చిన్నీ కొడుకా!
వో చిన్నీ కొడుకా!
నే, నిన్నుఁ గంటిఁ గదరోరి! నా చిన్నీ కొడుకా!
వో చిన్నీ కొడుకా! 2
నన్నుద్ధరించేవాని నా చిన్నీ కొడుకా!
వో చిన్నీ కొడుకా!
నేను, నమ్మి యుంటిని గదరా! నా చిన్నీ కొడుకా!
వో చిన్నీ కొడుకా! 3
పులికి నిన్నొప్పాగించి నా చిన్నీ కొడుకా!
వో చిన్నీ కొడుకా!
నే, నెట్లని తాళుదురా? నా చిన్నీ కొడుకా!
వో చిన్నీ కొడుకా! 4
కడుపులోనా జాలిమాలి నా చిన్నీ కొడుకా!
వో చిన్నీ కొడుకా!
యెంతో, ఘనమైన, దేమిసేతు? నా చిన్నీ కొడుకా!
వో చిన్నీ కొడుకా! 5
అద్దూ ముద్దూల చూచే నా చిన్నీ కొడుకా!
వో చిన్నీ కొడుకా!

నా, వద్దా నాడూదు రారా! నా చిన్నీ కొడుకా!
వో చిన్నీ కొడుకా! 6
తరిగొండా నరహరికి నా చిన్నీ కొడుకా!
వో చిన్నీ కొడుకా!
నిత్యాసేవలు జేతు రారా! నా చిన్నీ కొడుకా!
వో చిన్నీ కొడుకా! 7

ద్విపద. అని యిట్లు చింతించి - నంత లోపలను
తన మదిలోఁ గొంత - ధైర్యంబుఁ బూని
విడఁబడి తన చేతి - విల్లెక్కుపెట్టి
యదరార మేటియౌ - అంబులు పట్టి
*దూరాంబకంబులు - దొడిఁగి, వేఁటాడు
*ధైర్యంబు దప్పక - ధరణిపై నిలిచి,
*యెదురుగాఁ జెంచునా - యుని దిక్కుఁ జూచి
'పులి చన్న మార్గంబు - పొందుగాఁ జెప్పు!
చలమున నే దాని - సమయింతు నిపుడు
గిరుల డాఁగినను, భూ - ఝరుల డాఁగినను
మఱి బ్రహ్మ, రుద్రుల - మఱుఁగుఁ జొచ్చినను
*విడువను చూడుము - విలువిద్య శక్తి'
*అని పల్కి, తరిగొండ - హరి నాత్మ నెంచి.

---

*** ఈ మూడు పాదాలు ప్రాసమైత్రి లేకుండా, దేని కది విడివిడిగా ఉన్నాయి. మూడవ పాదంలో యతిమైత్రికూడ లోపించింది.

** ఈ రెండు పంక్తులు ప్రాసమైత్రి రహితంగా ఉన్నాయి.

**చెంచిత:**

వ. వినవోయి! చెంచునాయుఁడా! ఆ పులి శిశువును ఎత్తుకొని పోయిన చోటు చెప్పవోయి! చెంచునాయుఁడా! ౪౩

**చెంచునాయుఁడు:**

వ. వినవే! చెంచుభామా! ఆ పులి పోయిన జాడ నేఁ జూడలేదే! చెంచుభామా! ౪౮

## ✳ అపశకునములు ✳

వ. చెంచిత యెక్కు పెట్టిన విల్లునమ్ములు నేల విడిచి, తాను వచ్చేటప్పటి యపశకునంబులు దలంచి, తనలోఁదాను ప్రలాపించే విధం బెటువలెను. ౪౯

**దరువు - ఆది తాళం**

వచ్చే వేళలో నిపుడూ - వాయసము గట్యా
వాయసము గట్యా
కచ్చాడి హెచ్చి పైఁడికంటి - కలకలఁ బల్కే
కలకలఁ బల్కే 1

ఫక్కా ఫక్కాన బుధునిపై - గౌళి పల్కే
పై గౌళి పల్కే
గ్రక్కూనా కుందేళ్లూ - కనఁబడ నురికే
కనఁబడ నురికే 2

ఘూకాలు రెండూ గూడీ - కూఁతాలు బెట్యా
కూఁతాలు బెట్యా
కాకూలు దోఁపాయే, - గరుడూఁడు గట్యా
గరుడూఁడు గట్యా 3

ఫాలా తీర్చి కట్టే, - బావు రెదురాయే
బావు రెదురాయే
బాలూఁడు అందున్నా - పులిపాలై పోయే
పులిపాలై పోయే 4

ఉరువాడి నా చింతా - వుత్పాతమాయే
ఉత్పాత మాయే
తరిగొండ హరికీ నాపై - దయలేకా పోయే
దయలేకా పోయే 5

**చెంచునాయుఁడు:**

వ. కటకటా! చెంచితా! నా కడుపులో పేగు వుడుస్తూవున్నది. నీవు 'కొడుకో! కొడుకో!' యని కలవరిస్తూ వున్నావు. శ్రీ వేంకటేశ్వరుని గుడిలో నైనా గెంజి వంటకం తెచ్చి పెట్టవే! చెంచుభామా! ౧౦

వ. అనిన, నా చెంచునాయుని వెఱ్ఱితనంబునకు చెంచిత మతిన్నీ చింతించే విధం బెటువలెను. ౧౧

## ✳ చెంచెత మూర్ఛ ✳

ద్విపద.'కటకటా! నా ముద్దు - గారాబు పట్టి
నిటువలె నీశ్వరుం - డెడఁబాపెఁ దనకుఁ
బ్రాణనాథుఁడు వెఱ్ఱి - వాఁడౌటకతనఁ,
బ్రాణంబు నే నింకఁ - బట్టంగఁ దగునె?
బిడ్డలు లేక నేఁ - బెద్ద కాలమున
గొడ్డురాలనిపించు - కొని, పుట్టియున్న

*నా బిడ్డ నిప్పు డా - పులి కొప్పగించి
*కట్టిడియైన నా - కాయంబు నిలిచె,
నింక గూడెంబున - కెటువలెఁ బోదు?
కొంకక చెంచితల్ - 'కొడుకేది?' యంటె
'వాని నేఁ బులి కిచ్చి - వచ్చితి' ననుచు
నే నెట్లు చెప్పుదు?-నెక్కడఁ బోదు?
హోదైవమా! యెంత - యాపద వచ్చె?
ఈ దేహ మిట నిల్చె - నీ భూమియందు'
అని యని యెలుఁగెత్తి, - హా! యని యేడ్చి
అనువొందఁ దరిగొండ - హరి నాత్మ నెంచి
కన్నులలో నీటి - కణములు దొరుఁగఁ
*జెన్నలరంగ మ - హీ స్థలి రాలె.

## ✳ చెంచునాయుని కడుపు కక్కుర్తి ✳

### దరువు - ఆది తాళం

**చెంచునాయుఁడు:**

'కొడుకో! కొడుకో'! యని - కలవరించి పడితివటవె! చెంచితా!
బోఁటి! నీవిటులఁ బడితె - కూటి కెట్లనె? చెంచితా! 1
తేటగంజైన గుటికెడు - తెచ్చి పోయవె! చెంచితా! 2
నీవు, వేఁట మాంసం, పందిమాంసం - తెచ్చిపెట్టవె! చెంచితా! 3
గట్టిగా నే నుంటె బిడ్డలు - గలుగరటవే? చెంచితా! 4
పన్నుగా తరిగొండ నరహరి - ప్రభుని కరుణను చెంచితా! 5

---

** ఈ రెండు పంక్తులు ప్రాసమైత్రి లేకుండా, దేనికది విడివిడిగా ఉన్నాయి. వీటిలో మొదటి పంక్తిలో యతి మైత్రి తప్పింది.

* ఈ పాదంలో యతిమైత్రి ఆలోచింపదగివుంది.

## దరువు - ఆది తాళం

**చెంచిత:**

అయ్యయ్యో! నన్నీడ్చవద్దు చెంచునాయుఁడా!
నీ, ఆఁకలే నేఁ దీర్చలేను చెంచునాయుఁడా! 1

పట్టిమీఁద జాలిగాని చెంచునాయుఁడా!
నా, కేమిపని దోఁచదోయి! చెంచునాయుఁడా! 2

కూడు కావలసియుంటె చెంచునాయుఁడా!
నీవు, గూడెమునా కరుగవోయి! చెంచునాయుఁడా! 3

నా, కొడుకు మీఁద జాలే లేని చెంచునాయుఁడా!
ఇట్లా, బ్రదుకు సేయవచ్చునోయి? చెంచునాయుఁడా! 4

శ్రీతరిగొండ నరహరికిఁ జెంచునాయుఁడా!
నా, జీవ మర్పింతునోయి! చెంచునాయుఁడా! 5

వ. అని, యా చెంచిత స్వామిని ఉద్దేశించి యేమనుచున్నది: ౫౨

## దరువు - అట తాళం

ఇంతా నిర్దయుఁడావై- యెంతా జేసితివయ్యో! వేంకటేశా!
చింతా దీర్చే భారం - చిత్తామందున్నాదో, లేదో? వేంకటేశా! 1
నా పాలి తరిగొండా నరహరిని - నమ్మియుంటి వేంకటేశా!
నీకూ కోపామేలనయ్య?- కొడుకుఁ దెచ్చీవోయి! వేంకటేశా! 2

## ✳ ద్వారపాలకునిపై శ్రీవేంకటేశ్వరుని ఆవేశము ✳

వ. అనినఁ జెంచిత వచనంబులు విని, శ్రీ వేంకటేశ్వరుండు ఒక ద్వార

పాలకునిమీఁద ఆవేశంబు వచ్చిన, చెంచెత భీతిల్లి, యింకొక ద్వారపాలకునితో నేమనుచున్నది: ౭౩

**దరువు - జంపె తాళం**

**చెంచిత:**

కమ్మి కుమ్మర సారె - కైవడిని యీ ఘనుని (కనులు)
ముమ్మాటికిని తిరిగి- నా యేమిరో రన్నా? 1

**ద్వారపా:**

పతి వేంకటేశ్వరుఁడు-తనమీఁద కొచ్చి యిం
దతులిత మేమి యీ - డాడుచున్నాఁడు! 2

**చెంచిత:**

గట్టిగా యీ ఘనుని - పట్టి నే నడిగితే
దిట్టఁడై నా సుతునిఁ- దెచ్చీయు నన్నా? 3

**ద్వారపా:**

తక్కకను మనపాలి- తరిగొండ నరహరిని
అక్కఱతొ మ్రొక్కి నీ- వడుగవే! కొమ్మా! 4

## ✳ చెంచిత యాపద మ్రొక్కులు ✳

వ. అనినఁ జెంచుభామ యేమనుచున్నది: ౭౪

ద్విపద. శ్రీవేంకటేశ! నా - శిశువు నెట్లయిన
నీవేళఁ దెచ్చి నా- కిచ్చితివేని
గ్రక్కున నోటి బీ - గము వేసికొనియు
ఎక్కువగా మింట - నిల్లు గట్టుకొని

*నీ పైన భక్తితో - నే నడుగు దండాలు
*హితవు మీఱంగ నే - నిచటికి వచ్చి
పిడికెడు రూకలు - బిడ్డచే నీకు
ఎడమ కొప్పెరలోన వేయింతు నేను
*గండ దీపము మోతుఁ - గ్రమముతో నీకుఁ
*బొర్లు దండంబులు - పొరలింతు నేను
పొందుగా నేఁ గన్న - బుడుత నా చిన్నఁ
బొందుగా నిచ్చిన, - బొందె నీ కిత్తుఁ,
దప్ప నే నీ మాటఁ - దరిగొండ వాస!
చెప్పవే! యొక మాట - శ్రీ వేంకటేశ!

## ✳ ద్వారపాలకుని (స్వామివారి) పలుకులు ✳

**ద్వారపాలక (స్వామి వారి) వచనం:**

వ. ఓ చెంచుభామా! నీ వొనరఁగా నన్నుఁ జూచెదనని చెప్పి, చూడక వేఁటకుఁ బోయినందులకు పులి నీ పుత్రు నెత్తుకొని పోయినది. ఇప్పుడు బుద్ధి తెచ్చుకో! ౹౹

ద్విపద. పరఁగఁగా నీ మ్రొక్కు - బళ్లన్ని తీర్చు!
తరళాక్షి! యిదిగాక, - ధనము శీఘ్రముగ
ముదుపుగాఁ దెచ్చి నా - ముందరఁ బెట్టి
కొడుకును నెత్తుకొ - గూడెంబుఁ జేరు!
అంతటఁ దరిగొండ - హరియైన నేను
సంతసంబున నీకు - సంపద లిత్తు.

****ఈ నాలుగు పాదాలు ప్రాసమైత్రి రహితంగా, దేని కది విడిగా ఉన్నాయి.

చెంచిత:

తే.గీ. శ్రీరమాధీశ! యిపు డీవు చెప్పినట్టి
ధనము నే నెందుఁ దెత్తును? దానవారి!
నీవు ధనమున్న గుఱుఁజెప్పు నిజముగాను
తెచ్చి యిచ్చెద నది నేను దానవారి! ౫౬

ద్వారపా. (స్వామివారి) పల్కులు:

ద్విపద. వినవె! చెంచెత! నీవు – విశదంబుగాను
కని పర్వతంబు, శృం – గము లాఱు గడచి,
తలఁగక యుండెడి – ద్వాదశశృంగ
ములు గల నగము ల – గ్గలముగా దాఁటి,
....................... – యవలఁ జెన్నొందు
షోడశశృంగాద్రిఁ – జొరవతోఁ జొచ్చి,
నదులు మూఁడును దాఁటి, – నాల్గు మార్గములు
కుదురుగా నొక దిక్కు – కూడిన చోట
నిలిచిన చోట........ జ్వాలలోను
తొలఁగక బహుసుధా – ధారలు నెందుఁ
బడనీయ కయ్యంత్ర – పానంబు చేసి,
ముడిపడి తన మార్గ – మున కడ్డమగుచు
పడగ క్రిందను, తోఁక – పైనఁ బెట్టుకొని
బడలక సుధఁగ్రోలు – పాము వాకట్టు
గట్టి, మనంబుతో – గాలిని మూట
గట్టి, వారక సూర్య, – కమలశత్రువుల
మండలంబులు దాఁటి, – మాయాభిమాన

చంద్రగ్రహంబుల నెం - చక పాఱంద్రోలి,
వెలయు శృంగములతో - విఖ్యాతమగుచు
విలయ మెన్నడు లేని - వేదాద్రి కరిగి,
సద్రూప బలములు - స్థాపించియున్న
చిద్రూపధనమును - జేకొని వచ్చి,
అతిభక్తి మీఱ మా - కర్పించు! నీకు
గతియగు బిడ్డను - గరిత! నీ కిత్తు!
అని యిట్లు తరిగొండ - హరి దయమీఱ
మొనయ, మెల్లఁగఁ జెంచు - ముదిత యిట్లనియె:

**చెంచిత:**

వ. నే నెట్లైనా నతిసాహసము చేసి, యెట్లయినాను స్థిరముగాఁగ చిద్రూపధనమును నీ కిచ్చెదను; నీవు మచ్చి కలర నా కుమారుని బ్రదికించు నళిననాభా! ౯౬

## ✳ శ్రీస్వామివారు చెంచితపుత్రుని బ్రదికించుట ✳

తే.గీ. అనుచుఁ జెంచిత ప్రార్థింప, నా క్షణమున
మించి హరి పెద్దపులిని వధించి, దాని
కడుపులో నున్న చెంచిత కొడుకు నపుడు
మరల బ్రతికించి తెచ్చి యా మగువ కిచ్చె. ౯౭

తే.గీ. అపుడు చెంచిత హర్షించి యాత్మసుతుని
ముద్దులాడుచు, నటమున్ను మ్రొక్కినట్టి
మ్రొక్కుబడులన్ని తీర్చి, యా మూలధనము
నెలమి సాధించి హరి కిచ్చి యిట్టులనియె: ౯౮

## ⁕ మంగళము ⁕

ద్విపద. అంగజజనక! వి- ఖ్యాతుఁడ! నీకు
మంగళం బలమేలు - మంగా హృదీశ!
మంగళము తరిగొండ - మనుజ హర్యక్ష!
మంగళం బహిశైల! - మంగళ మనుచు
వినుతించి మ్రొక్కి, యా - వేంకటేశ్వరుని
యనుమతిఁ గైకొని, - యందుండి కదలి
చెంచునాయునిఁ గూడి - శిశువు నెత్తుకొని
చెంచిత గూడెంబుఁ - జేరె వేడుకను;
శ్రీనివాసుఁడు భక్త - సేవఁ గైకొనుచు
నానందనిలయమం - దాడుచునుండె.

## ⁕ కృతి సమర్పణము ⁕

ద్విపద. అని యిట్లు శేషాచ - లేశ్వరుండగుచుఁ
దనునేలు తరిగొండ - ధాముని పేర
వలనొప్పఁగా నంద - వరకులోద్భవుఁడు
చెలువంబు పొదలు వ - సిష్ఠ గోత్రుండు
అమిత కానాలవం - శాబ్ధి చంద్రుండు
విమల మానసుఁడు, కృ - పాబ్ధివాసుండు
అతనికిఁ బ్రియకాంత - యగు మంగమాంబ
సుత వెంగమాంబిక - సురుచిరంబుగను

కరమొప్పఁ జెంచెత - కథ వివరించె;
నిరవంద శ్రీవేంకటేశ! భూచక్ర
*మందిది పూర్ణమై, - యసమాన మహిమ
*నాచంద్రతారార్క - మై యుండుఁగాక!

**ఈ చివరి రెండు పాదాలు ప్రాసమైత్రి రహితంగా, దేని కది విడిగా ఉన్నాయి. ఈ రెంటికి మధ్య పూర్ణబిందు పూర్వక 'ద' కారప్రాసగల ఒక పంక్తి, 'చ' కారప్రాసగల మఱియొక పంక్తి లోపించినట్లు తెలుస్తున్నది.



తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# బాలాజి వికలాంగుల శస్త్ర చికిత్స పరిశోధనా మరియు పునరావాస కేంద్రం (బర్డ్)



నిరంతర సేవాకార్యక్రమం

తిరుమల తిరుపతి దేవస్థానంవారు, శారీరక వికలాంగములతో బాధపడువారికి సేవచేస్తూ ఉపశమనం కలుగజేయుటకొరకై 'బాలాజీ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సర్జరీ రీసెర్చి మరియు రిహాబిలిటేషన్ ఫర్ ది డిసేబుల్డ్' బర్డ్ సంస్థను స్థాపించింది. ఈ సంస్థ తి.తి.దేవస్థానం చేస్తున్న మానవసేవకు ప్రధాన ప్రతీక.

1985 లో స్థాపింపబడిన 'బర్డ్' సంస్థ అర్థోపెడిక్స్ (శల్యవైద్యం) రంగంలో అనేక విధాలుగా కృషిచేస్తున్నది. కాన్‌జెనిటల్ అనోమలిస్, సెరిబ్రాల్ పల్సీ రోగులు మరియు పోలియో వ్యాధి గ్రహస్థులకు ఈ ఆసుపత్రిలో విలువైన చికిత్సను చేస్తూ, నిరుపేదల సేవలో అంకితమై పూర్తి బాధ్యతలతో సేవలందిస్తున్నది.

'బర్డ్' ప్రధాన అంశములు

❖ చికిత్సలో ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం ఉపయోగించి చిన్నపిల్లల శల్య శస్త్ర చికిత్స, కీళ్ళమార్పిడి మరియు పునరావాసం కల్పించుట. ❖ 250 పడకల సామర్థ్యంతో, నాలుగు ఆపరేషన్ థియేటర్లతో ఎయిర్‌కండిషన్‌తో కూడిన ఆసుపత్రి. ❖ ఉచితంగా కృత్రిమ అవయవాల వితరణ, సహాయము, ఊతనందించుట. ❖ "బర్డ్"కు అందించే అన్ని విరళాలపై ఆదాయపు పన్ను చట్టం సెక్షన్ 80(జి) క్రింద పన్నుమినహాయింపు. ❖ 5 లక్షలు రూపాయలిచ్చిన దాతల పేర్లు ఫోటోలతోకూడ "బర్డ్" ఆసుపత్రిలో ఏర్పాటు చేస్తారు. ❖ ఒక సంవత్సరంలో (కాలండర్ ఇయర్) 5 మందికి 3 రోజులపాటు ఉచిత దర్శనం. 10 లడ్లు (చిన్నవి), ఒక దుప్పట, శ్రీవేంకటేశ్వరస్వామి, పద్మావతి అమ్మవార్ల వెండిబొమ్మలుగల మెమెంటో బహుకరణ. ❖ రు. 10 లక్షలు ఆపై విరాళమిచ్చిన దాతల పేర్లు గదివద్ద ఏర్పాటు చేస్తారు.

సహృదయులైన దాతల మరియు సామాన్య ప్రజలు "బర్డ్"కు అందజేసి విరాళాలు వివిధ ప్రాజెక్టుల అమలు, ఉచితంగా కృత్రిమ అవయవాల సరఫరా, ఉచితంగా ఆహారం, తగ్గింపు రేట్లతో రోగులకు ప్రయాణ సౌకర్యాలు కల్పించుటకు వినియోగించడం జరుగుతుంది. విరాళాలను - కార్యనిర్వహణాధికారి, బర్డ్ ట్రస్టు, తి.తి.దేవస్థానములు, తిరుపతి - 517 501 వారి పేరుతో డిమాండు డ్రాఫ్టులద్వారా పంపవచ్చును.

Published by Sri A.P.V.N. Sarma, I.A.S., Executive Officer
T.T.Devasthanams and Printed at Sri Parasaraya Press, Sri Vyasasramam.